# అథ షట్పంచాశత్తమో%ధ్యాయః

## బాణాసురుడు గణత్వమును పొందుట

నారద ఉవాచ |

కృష్ణే గతే ద్వారకాయామనిరుద్ధేన భార్యయా | అకార్షీత్కిం తతో బాణస్తత్త్వం వద మహామునే || 1

నారదుడిట్లు పలికెను -

ఓ మహర్షీ! భార్యాసమేతుడగు అనిరుద్ధునితో గూడి శ్రీకృష్ణుడు ద్వారకకు చేరిన తరువాత బాణుడు ఏమి చేసెను? నీవా విషయమును చెప్పుము (1).

సనత్కుమార ఉవాచ |

కృష్ణ గతే ద్వారకాయామనిరుద్ధేన భార్యయా | దుఃఖితో%భూత్తతో బాణస్స్వాజ్ఞానం సంస్మరన్ హృదా || 2

తతో నందీ శివగణో బాణం ప్రోవాచ దుఃఖితమ్ | దైత్యం శోణితదిగ్ధాంగమనుతాపసమన్వితమ్ || 3

సనత్కుమారుడిట్లు పలికెను -

భార్యాసమేతుడగు అనిరుద్ధునితో గూడి శ్రీకృష్ణుడు ద్వారకకు చేరెను. అపుడు బాణుడు మనస్సులో తన అజ్ఞానమును స్మరించి దుఃఖితుడాయెను (2). అపుడు శివుని గణాధ్యక్షుడగు నంది రక్తముతో తడిసిన దేహము గలవాడు, పశ్చాత్తాపదుఃఖముతో గూడినవాడు అగు బాణునితో నిట్లనెను (3).

నందీశ్వర ఉవాచ|

బాణ శంకరసద్భక్త మానుతాపం కురుష్వ భోః | భక్తానుకంపీ శంభుర్వై భక్తవత్సలనామధృక్ || 4

తదిచ్ఛయా చ యజ్జాతం తజ్జాతమితి చేతసా | మన్యస్వ భక్తశార్దూల శివం స్మర పునః పునః || 5

మన ఆద్యే సమాధాయ కురు నిత్యం మహోత్సవమ్ | భక్తానుకంపనస్యాస్య శంకరస్య పునః పునః || 6

నందివాక్యాత్తతో బాణో ద్విషాం శీర్షకమాత్రకః | శివస్థానం జగామాశు ధృత్వా ధైర్యం మహామనాః || 7

గత్వా తత్ర ప్రభుం నత్వా రురోదాతీవ విహ్వలః | గతగర్వవ్రజో బాణః ప్రేమాకులితమానసః || 8

సంస్తువన్ వివిధైః స్తోత్రైస్సంనమన్నుతితస్తథా | యథోచితం పాతఘాతం కుర్వన్ విక్షేపయన్ కరాన్ || 9

ననర్త తాండవం ముఖ్యం ప్రత్యాలీఢాదిశోభితమ్ | స్థానకైర్వివిధాకారైరాలీఢప్రముఖైరపి || 10

నందీశ్వరుడిట్లు పలికెను-

ఓ బాణా ! నీవు శంకరుని గొప్ప భక్తుడవు. ఓయీ ! దుఃఖించకుము. భక్తులయందు దయగల శంభునకు భక్తవత్సలుడను పేరు గలదు (4). ఓ భక్తశ్రేష్ఠా ! ఏది జరుగవలెనో, అది ఆయన ఇచ్ఛచేతనే జరిగినదని మనస్సులో నిశ్చయించుకొనుము. శివుని మరల మరల స్మరించుము (5). మనస్సును ఆ ఆదిపురుషునియందు నిలిపి, భక్తానుగ్రాహకుడగు ఆ శంకరుని మహోత్సవమును నిత్యము పలుమార్లు అనుష్ఠించుము (6). అపుడు గొప్ప స్వాభిమానముగల వాడు, శత్రువులకు రాహువువంటివాడు అగు బాణుడు నందియొక్క సలహాను పాటించి ధైర్యమును చిక్కబట్టుకొని, వెంటనే శివుని స్థానమునకు వెళ్ళెను (7). గర్వము పూర్తిగా తొలిగినవాడు, ప్రేమతో నిండిన హృదయము గలవాడు అగు బాణుడు అచటకు వెళ్లి ప్రభునకు నమస్కరించి దుఃఖమును పట్టజాలక భోరున ఏడ్చెను (8). అతడు వివిధస్తోత్రములతో ఆయనను స్తుతించి ప్రణమిల్లి ఆయనను పూజించెను. మరియు ఆతడు పాదముల కదలికలను,

చేతుల త్రిప్పుటలను యథాశాస్త్రముగా చేయుచూ, ఆలీఢ-ప్రత్యాలీఢ-స్థానకాది ప్రముఖ నాట్య విన్యాసములతో తాండవమును చేసెను (9, 10).

ముఖవాదసహస్రాణి భ్రూక్షేపసహితాన్యపి | శిరఃకంపసహస్రాణి ప్రాప్తానీకసస్సహస్రశః || 11

వారీశ్చ వివిధాకారా దర్శయిత్వా శ##నైశ్శ##నైః | తథా శోణితధారాభిస్సించయిత్వా మహీతలమ్ || 12

రుద్రం ప్రసాదయామాస శూలినం చంద్రశేఖరమ్ | బాణాసురో మహాభక్తో విస్మృతాత్మగతిర్నతః || 13

తతో నృత్యం మహత్కృత్వా భగవాన్ భక్తవత్సలః | ఉవాచ బాణం సంహృష్టో నృత్యగీతప్రియో హరః || 14

అతడు కనుబొమలను త్రిప్పుతూ నోటినుండి పలురకముల శబ్దములను సృజించి వేయి విధముల తలను ఆడించుచూ వేయిమంది పరిచారకులను సిద్ధముగా నుంచెను (11). ఆతడు వివిధ భంగిమలను మెల్లమెల్లగా ప్రదర్శించుచుండగా రక్తధారలతో నేల తడిసి పోయెను (12). మహాభక్తుడగు బాణాసురుడు తన దేహమును విస్మరించి నమస్కరించి, శూలధారి, చంద్రశేఖరుడు అగు రుద్రుని సంతోషపెట్టెను (13). అపుడు భక్తవత్సలుడు, నృత్యగానములయందు ప్రీతి గలవాడు అగు హరభగవానుడు గొప్ప నృత్యమును చేసి సంతోషముతో బాణునితో నిట్లనెను (14).

రుద్ర ఉవాచ |

బాణ తాత బలేః పుత్ర సంతుష్టో నర్తనేన తే | వరం గృహాణ దైత్యేంద్ర యత్తే మనసి వర్తతే || 15

రుద్రుడిట్లు పలికెను -

ఓ వత్సా ! బాణా! బలకుమారా ! నీ నర్తనమునకు సంతోషించితిని. ఓ రాక్షసరాజా ! నీ మనస్సులో గల కోరికను వరముగా స్వీకరించుము (15).

సనత్కుమార ఉవాచ |

ఇత్యాకర్ణ్య వచశ్శంభోర్దైత్యేంద్రేణ తదా మునే | బాణ న సంవృణీతోఽభూద్వరస్తు వ్రణరోపణ || 16

బాహుయుద్ధస్య చోద్ధత్తిర్గాణపత్యమథాక్షయమ్ | ఉషాపుత్రస్య రాజ్యం తు తస్మిన్ శోణితకాహ్వయే || 17

నిర్వైరతా చ విబుధైర్విష్ణునా చ విశేషతః | న పునర్దైత్యతా దుష్టా రజసా తమసా యుతా || 18

శంభుభక్తిర్విశేషేణ నిర్వ్యాకారా సదా మునే | శివభ##క్తేషు చ స్నేహో దయా సర్వేషు జంతుషు || 19

ఇతి కృత్వా వరాన్ శంభోర్బలిపుత్రో మహాసురః | ప్రేమ్ణాశ్రునయనో రుద్రం తుష్టావ సుకృతాంజలిః || 20

సనత్కుమారుడు ఇట్లు పలికెను -

ఓ మునీ ! శంభుని ఈ వచనములను విని అపుడా రాక్షసరాజు ఈ వరములను కోరెను: గాయములు మానుట, బాహుయుద్ధములో ప్రాగల్భ్యము, వినాశములేని గణాధ్యక్షస్థానము, ఉషయొక్క పుత్రుడు శోణితపురమునకు రాజు అగుట, దేవతలతో మరియు ప్రత్యేకించి విష్ణువుతో వైరము లేకుండుట, రజస్తమోగుణములతో కూడియున్న ఈ రాక్షసజన్మ మరల కలుగకుండుట, సర్వకాలములయందు వికారములు లేని విశేష శివభక్తి, శివభక్తులతో మైత్రి, సర్వప్రాణులయందు దయ (16-19). బలిపుత్రుడగు ఆ మహారాక్షసుడు శంభునినుండి ఈ వరములను కోరి, చక్కగా చేతులను జోడించి, కన్నులనుండి ప్రేమాశ్రువులు జారుచుండగా రుద్రుని స్తుతించెను (20).

బాణ ఉవాచ |

దేవ దేవ మహాదేవ శరణాగతవత్సల | త్వాం నమామి మహేశాన దీనబంధో దయానిధే || 21

కృతా మయి కృపాతీవ కృపాసాగర శంకర | గర్వోఽపహారితస్సర్వః ప్రసన్నేన మమ ప్రభో || 22

త్వం బ్రహ్మ పరమాత్మా హి సర్వవ్యాప్యఖిలేశ్వరః | బ్రహ్మాండతనురుగ్రేశో విరాట్ సర్వాన్వితః పరః || 23

నాభిర్నభోఽగ్నిర్వదనమంబు రేతో దిశశ్శ్రుతిః | ద్యౌశ్శిర్షమంఘ్రిరుర్వీతే మనశ్చంద్రస్తవ ప్రభో || 24

దృగర్కోజఠరం వార్ధిర్భుజేంద్రో ధిషణా విధిః | ప్రజాపతిర్విసర్గశ్చ ధర్మో హి హృదయం తవ || 25

రోమాణ్యోషధయో నాథకేశా జలముచస్తవ | గుణాస్త్రయస్త్రినేత్రాణి సర్వాత్మా పురుషో భవాన్ || 26

బ్రాహ్మణం తే ముఖం ప్రాహూర్బాహుం క్షత్రియమేవ చ | ఊరుజం వైశ్యమాహుస్తే పాదజం శూద్రమేవ చ || 27

త్వమేవ సర్వదోపాస్యస్సర్వైర్జీవైర్మ హేశ్వర | త్వాం భజన్ పరమాం ముక్తిం లభ##తే పురుషో ధ్రువమ్ || 28

యస్త్వాం విసృజతే మర్త్య ఆత్మానం ప్రియమీశ్వరమ్ | విపర్యయేంద్రియార్థార్థం విషమత్త్యమృతం త్యజన్ || 29

విష్ణుర్బ్రహ్మాథ విబుధా మునయశ్చామలాశయాః | సర్వాత్మనా ప్రపన్నాస్త్వాం శంకరం ప్రియమీశ్వరమ్ || 30

బాణుడిట్లు పలికెను -

ఓ దేవదేవా ! మహాదేవా ! శరణాగతవత్సలా ! మహేశ్వరా ! దీనబంధూ ! దయానిధీ ! నీకు నమస్కారము (21). ఓ దయాసముద్రా! శంకరా ! నీవు నాయందు గొప్ప దయను చూపితివి. ఓ ప్రభూ ! నీవు ప్రసన్నుడవై నా గర్వమునంతను అడంచితివి (22). పరమాత్మ, సర్వవ్యాపి, సర్వేశ్వరుడు, బ్రహ్మాండములే దేహముగా గలవాడు, భయంకరుడగు ఈశ్వరుడు, విరాట్ స్వరూపమునందు అనుగతమైన సర్వజగత్తు గలవాడు అగు

పరంబ్రహ్మ నీవే (23). ఆకాశము నీ నాభి. అగ్ని నోరు. జలము రేతస్సు. దిక్కులు చెవులు. స్వర్గ లోకము శిరస్సు. భూమి నీ పాదము. ఓ ప్రభూ ! చంద్రుడు నీ మనస్సు (24). సూర్యుడు నీ కన్ను. సముద్రము నీ జఠరము. ఇంద్రుడు నీ భుజము. నీ బుద్ధి బ్రహ్మ. ప్రజాపతి విసర్గము. విసర్గమనగా వివిధరూపములలో నున్న సృష్టి. ధర్మము నీ హృదయము (25). వృక్షలతాదులు నీ రోమములు ఓ నాథా ! మేఘములు నీ కేశములు. మూడు గుణములు నీకన్నులు. సర్వస్వరూపడవగు పురుషడవు నీవే (26). బ్రాహ్మణుడు నీ ముఖమనియు, బాహువులు క్షత్రియుడనియు, వైశ్యుడు ఊరువులనియు, శూద్రుడు పాదమనియు చెప్పెదరు (27). ఓ మహేశ్వరా! సర్వజీవులచే సర్వకాలములయందు ఉపాసించదగినవాడవు నీవే. మానవుడు నిన్ను సేవించి నిశ్చయముగా శ్రేష్ఠమగు ముక్తిని పొందును (28). ఆత్మరూపుడు, ప్రియుడు, ఈశ్వరుడు అగు నిన్ను ఏ మానవుడైతే విరుద్ధములగు ఇంద్రియభోగములకొరకై విడనాడునో, వాడు అమృతమును పరిత్యజించి విషమును భక్షించుచున్నాడు (29). ప్రియుడు, ఈశ్వరుడు, శంకరుడు అగు నిన్ను విష్ణువు, బ్రహ్మ, దేవతలు మరియు పరిశుద్ధమగు అంతఃకరణము గల మునులు సర్వ విధములుగా శరణు పొందియున్నారు (30).

సనత్కుమార ఉవాచ |

ఇత్యుక్త్వా బలిపుత్రస్తు విరరామ శరాసురః | ప్రేమప్రఫుల్లితాంగశ్చ ప్రణమ్య స మహేశ్వరమ్ || 31

ఇతి శ్రుత్వా స్వభక్తస్య బాణస్య భగవాన్ భవః | సర్వం లభిష్యసీత్యుక్త్వా తత్రైవాంతరధీయత || 32

తతశ్శంభోః ప్రసాదేన మహాకాలత్వమాగతః | రుద్రస్యానుచరో బాణో మహాప్రముదితో<sup></sup>భవత్ || 34

ఇతి కిల శరనామ్నశ్శంకరస్యాపి వృత్తం సకలగురుజనానాం సద్గురుశ్శూలపాణ ః |

కథితమిహ వరిష్ఠం శ్రోత్రరమ్యైర్వచోభిస్సకలభువనమధ్యే క్రీడమానస్య నిత్యమ్ ||

ఇతి శ్రీ శివమహాపురాణ రుద్రసంహితాయాం యుద్ధఖండే బాణాసురగణత్వప్రాప్తివర్ణనం నామ షట్పంచాశత్తమో%ధ్యాయః (56).

సనత్కుమార ఉవాచ |

బలిపుత్రుడగు బాణాసురుడు ఇట్లు పలికి ప్రేమతో పులకరించిన అవయవములు గలవాడై మహేశ్వరునకు ప్రణమిల్లి విరమించెను (31). శివభగవానుడు తన భక్తుని ఈ వచనములను విని నీకు సర్వము లభించగలదని పలికి వెంటనే అంతర్ధానమును చెందెను (32). తరువాత శంభుని అనుగ్రహముచే రుద్రుని అనుచరుడగు బాణుడు మహా కాలపర్యంతము చిరంజీవియై గొప్ప ఆనందమును పొందెను (33). గురుజనులందరికీ సద్గురువు, శూలపాణి, సమస్త బ్రహ్మాండముల మధ్యలో నిత్యము క్రీడించువాడు అగు శంకరుని శ్రేష్ఠమగు గాథ మరియు బాణుని వృత్తాంతము చెవులకు ఇంపైన వచనములలో ఈ విధముగా ఇచట చెప్పబడినది (34).

శ్రీశివమహాపురాణములోని రుద్రసంహితయందు యుద్ధఖండలో బాణాసురుడు గణత్వమును పొందుట అనే ఏబది యారవ అధ్యాయము ముగిసినది (56).